

**BARDO THODAL పుస్తక పరిచయముBY VARANASI SREE RAMA KRISHNA OF AMARAVATHI**

టిబెటియన్ భాషలో ది బుక్ అఫ్ ది డెడ్ అనే బౌద్ధ గ్రంథము వున్నది -ఇది దాని సారము

టిబెట్ లోని బుద్ధిజం గురించి **7-5-24**

టిబెట్ లో బౌద్ధానికి పూర్వము ఏమతమూ లేదా ? . షమన్ లు అని ఒక తెగ వారు వున్నారు . వారు మన

పూజారుల వంటి వారు .  వీరే  చని పోయిన వారికి కూడా  ఆహారము అవసరము -  వారు మనకి  ఏదన్నా సహాయం చేయాలంటే వారికి కూడా , శక్తీ అవసరము" అని భోదించారు . " మృతులకు ఎంత గొప్ప ఆహారము పెడితే వారు అంత  శక్తిని పొంది -- ఆ శక్తి తో   తిరిగి మనకే మేలు చేస్తారు " అనే విషయానికి  ప్రజలు ఆకర్షితులు అయినారు . ఇలా మృతలకు నైవేద్యాలు మొదలయ్యాయి .  టిబెటియన్ లు  షమన్ ల భావాలను ప్రోత్సహించారు.  ప్రజలు తమను నమ్మటం షమన్



Photo of a shaman

పూజారులకు మంచి బలాన్ని ఇచ్చింది . అప్పుడు టిబెట్లో- షమన్ ల నేతృత్వంలో " బ్లాక్ బాన్" (Bon nag) అనే ఒక తెగ, ఏర్పడి - మృతులను ఆరాధించటం అనేది తప్పని సరిగా చేయవలిన పనిగా మార్చింది . మనుషులు ఎవరినన్నా గౌరవించ వలసి వస్తే అది వారి తల్లి తండ్రులు మరియూ వారి అన్న తమ్ములు మాత్రమే అని వీరు చెప్పారు . గౌరవంగా చూసుకున్న వారి మృత దేహాలను - వూరికే పూడ్చి వేయటం / లేదా కాల్చి వేయటం చేస్తే అది మృతుల పట్ల అగౌరవం అవుతుందని షమన్ లు భోదించాబు. వీరి బోధనల ప్రకారం , మొదటిలో, ఎవరి ఇంటి వారి మృతదేహాలను ఆ ఇంటి వారే భద్రము చేసుకొని - వారి స్మృత్యర్థం ఎదో ఒక కార్యక్రమం నిర్వహించటం చేయాలి . తరువాత రోజుల్లో ఈ కార్యక్రమాల్లో చని పోయినవారికి విందు ఇచ్చి వారితో పాటుగా తాము కూచొని తినటం ఒక పద్దతిగా మారింది . విందు అన్నది మంచి పంటల అనంతరమే సాధ్యము కాబట్టి ఇవి పంటల కాలం తరువాత మాత్రమే ఉండేవి. ఈ విందులు సమాధుల పక్కనే ఉండేవి. మృతి చెందిన వారికి ఆహ్వానం పలికే మాటలు = మంత్రాలూ చెప్పటానికి shaman లు అనే వారే పూజారులుగా

మారి  రంగ ప్రవేశం చేశారు .{ ఇవాళ్టి మన తద్దినపు మంత్రాలూ అన్నీ కూడా దేవతలనూ పిత్రుదేవతలనూ ఆహ్వానం చేయటం - వారికి ఆహారం ఇవ్వటం గురించే ఉంటాయి }
ఇహ విందు విషయానికి వస్తే - కనీసం ఫది మంది చేరారు అనుకున్నా - అందరికీ సరిపడు  మాంసము మరియూ  ఆహారము అప్పటికప్పుడు తెచ్చుకోకపోవటం సాధ్యం కాక పోవచ్చు .  కారణం వేటకు తగిన జంతువు దొరక వచ్చు దొరకక  పోవచ్చు . అందువల్ల ముందుగానే జంతు మాసం సేకరించి పెట్టుకునే అవసరం ఏర్పడింది . ముందుగానే సేకరించి పెట్టుకున్న మాంసము  కుళ్ళి విషంగా మారవచ్చు కదా ? ఆ విషఆహారము పెద్దలకు నైవేద్యము పెట్టితే ఫరవాలేదు కానీ అదే  నైవేద్యాన్ని తిని ఎవరైనా మరణిస్తే ఆ తప్పు ఎవరిదవుతుంది ? నైవేద్యాలకు పవిత్రత తెప్పించలేక పోయిన షమన్ లదే అవుతుంది కదా ?  అందు వల్ల -- ఏ జంతువు యొక్క మాంసం తొందరగా కుళ్ళుతుంది - ఏది మరునాటికి కూడా  మన్నుతుంది  అనే విషయాలు  తెలుసుకోవటం షమన్ లకు అవసరమైంది . తినే ఆకులు,  గడ్డి ని బట్టి -- జంతు  మాంసంలో ని  రుచి , అది   నిలువ వుండే లక్షణాలు  , వస్తున్నవి అని  మొదటిగా  గ్రహించారు .

ఇంతే  కాక అవి చూపే వేగము , తెలివి , చురుకు దనము వంటి వాటికి అవి తినే ఆహారానికి  కూడా ఎదో సంభందం వుంది అని కూడా  గ్రహించారు .  షమన్ లు తమకు వచ్చిన ఈ గ్రహింపును మనుషుల పాలిట వైద్యంగా మార్చారు  . తాము  ఎంత ప్రయత్నించి నా గానీ తమ  చెట్ల  మందుల తో నయం చేయలేని రోగాన్ని పెద్దలు కల్పించి న  పీడ గా   ఈ షమన్ లు   ప్రచారం చేశారు .

పెద్దలు ఎదో పీడా కలిగిస్తారు అని చెప్పింది వీరే కాబట్టి - దానికి విరుగుడు ఏమిటో ఆలోచించ వలసినది కూడా వీరే అయినారు . ఇప్పుడు షమన్ లో నుండి , మృతుల కర్మ కాండాలను జరిపే వ్యక్తులు,వీరిలోనుండే ఆహార వైద్యులు - వీరిలోనుండి - మంత్రం వేసే వైద్యులు పుట్టారు .

మృతుడు మనకు ప్రత్యేక అతిధి - కానీ అతని కోసము అని  ప్రత్యేకం గా ఏ ఆహారాన్ని సృష్టించటం కుదరదు కాబట్టి  { అప్పటికి వండుకోవటం అనేది  రాలేదు పచ్చివి తినటమే  }- వున్న దానిపై ఆకు పసర్లు- పూల రేకులు చల్లి ఆహారము యొక్క  రంగులు మార్చి  -  రుచిని మార్చి - వాటిని మృతులకు నైవేద్యం చేసి,  ఆపై  ఆ నైవేద్యాన్ని  పంచుకొని తిన్నారు.  ఇదేరకంగా దుష్ట

శక్తులకు కూడా ఆహారం తయారీ అయింది . కానీ దాన్ని నైవేద్యం కింద తిన వద్దు అన్నారు . ఎందుకంటే దుష్టశక్తి మన పూర్వీకుడే గానీ గౌరవింప తగ్గది కాదు కనుక
బుద్దిస్ట్ ఆస్ట్రాలజీ మరియూ మెడిసిన్
టిబెట్ లో షమన్ లు అనే వారి వల్లనే ఆస్ట్రాలజీకూడా జనించింది . మృతుల అంత్య క్రియలలు జరిపించే వారు తమకు మరింత ప్రాముఖ్యము సంపాదించు కోవడం కోసము అని-- మృతుని కాల్చటం మంచిదా ? . పాతి పెట్టటం మంచిదా ? పారే నదుల నీటిలో విడవటం మంచిదా ? కొండ శిఖరాల మీద మృత దేహాన్ని పెట్టి దాన్ని దేమునికి తిరిగి ఒప్ప చెప్పటం మంచిదా ? అనే విషయాలను చర్చకు లేవదీసి -ప్రజల ముందు కు పెట్టారు . ఏవిధముగా మృతుని పంపించాలి ? అన్న ప్రశ్న వచ్చినపుడు , ఓ వ్యక్తి మృతి చెందిన కాలము {ఉదయము సాయంత్రము మధ్యాహ్నము సాయంత్రము } , అతని తల పడిన దిక్కు- ఆ దిక్కున నేల ఉన్నదా ? నీరు ఉన్నదా ? చెట్లు ఉన్నావా ? చంద్రుడు వున్నాడా ? సూర్యుడు వున్నాడా ? ఈ రొండూ కాక కేవలము నక్షత్రములే ఉన్నావా ? ఉంటే అవి ఏమి నక్షత్రములు ? అనే వాటికి ఎంతో ప్రాధాన్యత వున్నదని , దానిని అనుసరించి మృతని అంత్యక్రియలు జరపాలని- ప్రజలకు

భోదించి , దాని ఆధారంగా మృత దేహాలకు అంతిమ సంస్కారములు జరిపే విధానము తీసుకు వచ్చారు . ఈ రకముగా  మరణము అనే దానిని ఆ శ్రయించుకొని టిబెటియన్ ఆస్ట్రాలజీ మూల రూపము పుట్టింది .

చావు - దాని తరువాత సంగతులు అన్న విషయాన్ని చెప్పి  - ప్రజలనుండి లబ్ది  పొందటం కన్నా   - బ్రతికి ఉన్న వారికి - ఆరోగ్యము -  సంపదలు సుఖాలు సమకూర్చటము అనే విషయాలు చెప్పి  సొమ్ము సంపాదించటం తేలిక అని తెల్సుకున్న వారు జోస్యము చెప్పటం మొదలు పెట్టి  ,  ఆ దిశగా    ముందుకు సాగి పోయారు  .  చావును గురించి ఎదో తెలుసుకోవటం కన్నా -  జోస్యము ద్వారా తమకు రాబోయే కష్ట  సుఖాల గురించి ముందుగా నే  ఎదో ఒకటి తెలుసుకో గలము అన్న భ్రమ ఏ  ప్రజలకు ఎక్కువగా నచ్చింది .  జోతిష్య వేత్తలు - సుఖానికి ముడిపెట్టి అనేక పూజలు రూపొందించారు . అయితే  సుఖంగా జీవించటంలో ఆరోగ్యమే ముఖ్యమైనది కాబట్టి - దేహానికి సుఖము/ఆరోగ్యము   ఇవ్వటం అనే విషయము మీద ఏదన్న ఒక మందు / ఆహారము / మూలిక/ పానీయము వంటిది  కని పెట్ట వలసిన అవసరము  జ్యోతిష్యులకు

కూడా   కలిగింది . చేసే పూజలతో పాటు తగిన మందును కూడా జత కలిపితేనే కానీ  కోరుకున్న ఫలితాలు తెప్పించ లేమని- ఫలితాలు లేకపోతే జనులు తమను ఎక్కువ కాలము ఆదరించబు  అని  భావించిన జోస్యులు రు మందుల రూపకల్పన పై కూడా ద్రుష్టి పెట్టారు .  వీరు మొదటగా , మానసిక శాస్త్రము = ఎదుటి మనిషి లోని ఆలోచనలు  గ్రహించే మెళుకువలు గ్రంథస్థము చేసి , ఆపై శరీరము గురించి.  రోగి శరీర ము చూపే రోగ  లక్షణాలను కూడా గ్రంథస్థము చేశారు .  ఏది ఏమైనా మనిషి ని ఇంకొక రోజు ఎక్కువ బ్రతికించినా చాలు - మన పంట పండుతుంది  అన్న దృష్టితో వీరు చేయవలసిందంతా చేశారు -
ఈ రకంగా - షమన్ లనుండి  పూజారులు - పూజారుల నుండి  ఆస్ట్రాలజర్లు  - పూజారుల నుండి వైద్యులు - వీరి నుండి మరోరకపు జోస్యులు వచ్చారు .

ఇహ   మృత దేహాలకు సంభందించి  పాతి పెట్టటం లేదా దహనం చేయటము అనే మార్గాలు మాత్రమే ప్రజాదరణ పొంది నిల దొక్కు కున్నాయి.   నిత్య జీవితములో తమకు ఎదురయ్యే  అనుకూలత/వ్యతిరేకత  లను బట్టి జనులు ఈ రెండు పద్ధతులనే  ఆదరించారు .  బుద్ధిజం

టిబెట్ లోకి ప్రవేశించాక - మృతుని పూడ్చాలా ? కాల్చాలా అన్న విషయన్ని వ్యక్తి నిర్ణయానికి వదిలి వేసింది {.దీనికి అనుగుణంగానే టిబెట్ లోని బుద్దిస్టు లకు అంత్యక్రియలు జరుగుతాయి .}     ప్రజలు   తమకు నచ్చినలేదా  అనుకూలము ఐన  సిద్ధాంతములు ప్రతిపాదించిన వారికి  అనుమాయిలు గా మారి - ఆందరూ  కలసి  ఒక కులమో మతమో ఏర్పరుచుకున్నారు .

భారత దేశము లోనుండి బయలు దేరిన బౌద్ధ సన్యాసులు ఈ  టిబెట్ ప్రాంతములో కుండా పెళ్ళేటపుడు వారికి  ఎటువంటి రోగాలు రావని అనలేము  కదా ? అందువల్ల వీరు తాము బయలు దేరిన చోట  వున్న కొన్నిపైద్య విధానాలు తెలుసుకున్నారు . బౌద్ధ మఠాలు - తాము ప్రచారం కోసం పంపే బౌద్ధ సన్యాసులకు బుద్ధుని బోధనలతో పాటు కొంత పైద్యాన్ని కూడా నేర్పింది . ఎందుకు అంటే - పైద్యము చేయగలవారిని ప్రజలు తమ నమ్మకాలకు అతీతంగా ఆదరిస్తారు కదా ? ఇది బౌద్ధ మత ప్రచారానికి ఎంతో  అనుకూలిస్తుంది కదా ? అందుకు.     ఒక సన్యాసి- తెలివిగలవాడు - అన్ని  బౌద్ధ శాస్త్రాలు చదివిన వాడిని  .  ప్రచారానికి పంపారు  .అతను

దారిలో అనారోగ్యముతో మరణిస్తే అతని కి విద్యలు నేర్పటం మీద పెట్టిన శ్రమ అంతా వృధా ఏ కదా ?ఇలాంటి వృధాకి విరుగుడు గా బౌద్ధ ప్రచారకులకు  ఆరోగ్య శాస్త్రము మరియూ  మందులగురించి నేర్పారు .

ఈ బౌద్ధ సన్యాసులు టిబెట్ లోకి ప్రవేశించాక---  షమన్ లచే - ప్రజలకు పరిచయం చేయ బడ్డ ఆచారాలు  -- యాస్ట్రాల జీ  --  మానసిక - శారీరిక శాస్త్రాలు  -మూలికా వైద్య విధానాల గురించీ  తెలుసుకొని -- వాటికి తమకు అప్పటికే తెలిసిన విషయాలను జతకలిపారు .  . సందర్భాను సారంగా వాటిని గ్రంథస్థము కూడా చేశారు . ఇప్పుడు చూస్తే ,  టిబెట్లో ని షమన్  ల ఆలోచనలు -భారతదేశము నుండి వచ్చిన బుద్ధిస్టు ల ఆలోచనలు ఒకదానితో ఒకటి కలగలిసి చివరికి  టిబెట్ బుద్ధిజమ్ ,టిబెటియన్  మెడిసిన్ , టిబెటియన్ ఆస్ట్రాలజీ అనే వి రూపొందాయి  . అనీ విడివిడిగా ప్రత్యేక శాఖలుగా వర్ధిల్లాయి ,

రచన సేకరణ వివరణ వారణాసి శ్రీ రామ కృష్ణ  .

టిబెటియన్ మత సంప్రదాయాలు -

## ఏర్పడిన విధము 9-05-24

టిబెట్ లోని షమన్ లు అనే వారి ఆలోచనలు - భారతదేశము నుండి బయలు దేరిన బుద్ధిస్టుల ఆలోచనలు- జత కలిసి టిబెటియన్ బుద్ధిజం ఏర్పడింది అని ఇంతకు ముందు చెప్పుకున్నాము .

టిబిటియన్ బుద్ధిజం కేవలం బుద్ధిజం గురించికాక - హిమాలయపు ప్రాంతపు జనులు ఆరోగ్యము తోనూ, ఆనందము తోనూ జీవించాలన్న కోరికతో వారి జీవితంలోకి అనేక నమ్మ కాలను సంప్రదాయాలనూ ప్రవేశపెట్టింది . టిబెటియన్ లు తమ తెగ లక్షణాలను ఎంతో ప్రేమిస్తారు . వాటిలోమార్పు రావటానికి ఇష్టపడరు . అందువల్ల ఎన్నో వేల ఏండ్ల కింద ఉన్న వారి ఆచారాలు సాంప్రదాయాలు , పద్ధతులు , ఇప్పటికీ మనకు తెలుస్తూ నే ఉంటాయి

.

ఏ దేశము లో నైనా సరే ఆచారాలు సాంప్రదాయాలు , పద్ధతులు అనేవి-- పుట్టుక మరియూ మరణము గురించినవే అయ్యి ఉంటాయి . దుష్ట శక్తులే మరణానికి. జబ్బులకు కారణము అని టిబెటిన్ వారు

నమ్ము తారు.  బుద్ధునికి ముందు టిబెట్ లో shamans = షమన్ లు అనే వారు కొన్ని మత సంప్ర దాయాలను వృద్ధి చేశారు . షమన్ అనగా " ఆరోగ్యము చేకూర్చేందుకు దేవతలను ఆహ్వానించే వాడు --దయ్యాలను  నియంత్రించే వాడు.-- జరగబోయే సంఘటనలను నిలుపు చేసేవాడు" అని అర్ధము . వీరి ప్రకారము సృష్టి లో మూడు లోకాలు సృష్టి ఐ వున్నవి .aviకింద లోకము , మధ్య లోకము , పై లోకము . పైలోకంలో చనిపోయిన వాఋ  నివసిస్తూ ఉంటాఋ  . వీరి అందరి లోనూ   మంచి చెడు అనే రొండు గుణాలు ఉంటాయి . ఒక వ్యక్తి తల్లి తండ్రులు -రక్తసంబంధీకులు మాత్రమే - ఆ వ్యక్తి పట్ల దుష్ట సెక్తిగాలేక మంచి సెక్తిగా  మారకలుగు తాఋ . అందువల్ల ప్రతి కుటుంబము నకూ  కూడా  దుష్ట శెక్తులు  వేరు వేరుగా ఉంటవి . కాబట్టి మృతులను తృప్తి పరచాలి అని చెపుతూ  షమన్ లు అనేక మరణాంతర క్రతువులు సృష్టించారు . దీనిని "black bon " సంప్ర దాయము  అంటారు .

black  bon అంటే నమ్మని వారు white Bon (bon dkar) అనే మార్గము రూపొందించుకున్నారు . ఇది ధైవాన్ని ఆరాధించమని చెప్పే శాఖ . ఈ రెండు శాఖల మధ్య వైరాలు తల ఎత్తగా - ఆ గోల భరించలేని Khrisong Detsen  అనే రాజు గారు రెండు మతాలనూ టిబెట్లో లేకుండా నిషేధించాడు .చాలా కాలం పాటు ఎవరో ఒకరి దిక్కున మాట్లాడుతూ ఎక్కవ కాలం గడపలేమన్న - తెలివితో నూ  - ఒకపక్షమే మాట్లాడినది వింటూ కూచుంటే - రెండో పక్షము వారిని అవమానించినట్లు అవుతుంది - వారితో వైరము వస్తుంది అన్న తెలివితో  నూ.  అయన టిబెట్లో ని అన్ని మతాలను నిషేధించాడు . ఒక ఫది సంవత్సరాల పాటు ఈ నిషేధమును వ్యతిరేకించిన వారినందరినీ   హింసించి చంపాడు . ఇట్లాగా టిబెట్లో అహింస మరియూ  ఎదో ఒక మతము యొక్క అవసరమూ  చాలా పెరిగింది . మనుషుల మనసుల లో దేముడు , మతము నేవి లేకుండా చేయటం ఎవరికీ సాధ్యం కాదు కదా .  "Tubo కింగ్" { tubo = టిబెటియన్}  రాజు "Songtsan Gambo "  బుద్ధిజం ని ఆదరించి , దానిని ప్రజలకు పరిచయం చేయించాడు.

తిరిగి తమకు ఒక మతము అనేది లభించటంతో ప్రజలు తమ కున్న పాత నమ్మకాలన్నింటినీ బుద్ధిజం లోకి చొప్పించి వదిలారు . అందువల్ల టిబెటన్ బుద్ధిజం ఒక ప్రత్యేక బుద్ధిజం గా మారింది . ఆపై టిబెట్ లోని మహాయాన బుద్ధిజం " చావు - ఆత్మ " అనే సంభంధాల గురించి మరింత లోతుగా వెళ్ళింది . చని పోయిన తరువాత కూడా ఎదో ఒక స్పృహ ఉంటూ వున్నది కదా ? {అనగా bardo స్థితి= చని పోయి- తిరిగి పుట్టటానికి గల కాలము } కాబట్టి మనము మృతులను వెనక్కి తేలేమా ? చావును నివారించలేమా ? అన్న దానిపై ద్రుష్టి పెట్టారు . చావు అనేది ఆత్మకి సంభవించే దురదృష్టము గా వీరు వర్ణించారు . వీరు trikya అనే దానిని ప్రతిపాదించారు . త్రిక్య -- అనగా మనిషి కి మూడు శరీరాలు వున్నవి అని .

అవి :- 01 . dharmakaya (ధర్మ కాయము = శాశ్వత దేహము / ఎటువంటి స్థితిలోనూ ఈ మార్పులూ చేర్పులూ పొందని దేహము= జ్ఞ్యానము అనే దేహము }

02 :-sambogakaya ( సంభోగ కాయము = సుఖము సంతోషము దుఃఖము వంటివి అనుభవము పొందే

దేహము } 03 . nirmanakaya (నిర్మాణ కాయము = రక్త మాంసములతో నిండిన దేహము } { నావివరణ - సంభోగ శరీరము యొక్క సుఖము కోరి చేసేది కాబట్టి రతి క్రియను సంభోగము అని కూడా అన్నారు }

త్రికాయా -- అనేది కనిపెట్టినప్పటినుండి టిబెటియన్ బుద్ధిస్ట్ సన్యాసులు ఒక దేహము లోనుండి ఒక దేహములోకి ప్రయాణిస్తూ ఉండటం అనేది సాధన చేయ సాగారు . శాశ్వత ము అయిన ధర్మకాయము = జ్ఞ్యాన దేహము , పొందుట ద్వారా మృత్యువును దరి చేరనివ్వకుండా చూసుకోవచ్చని - ప్రతి పాదించారు { ఇదే గీత లోని జ్ఞ్యాన యోగము ?} , {నా అభిప్రాయము = మృత్యువు మనను సమీపించినప్పుడు -దానిని గుర్తెరిగిన వారు నిర్మాణ కాయము లోనుండి ధర్మ కాయములోనికి వెళ్లి మృత్యు వును తప్పించుకోవచ్చు . తప్పించుకోవాలి . అలాగే తాము పొందిన జ్ఞ్యానమును ఇతరులకు పంచటం ద్వారా ధర్మకాయాన్ని కలకాలం నిలుపుకోని, {హిందూ ఇజం లో కీర్తి కాయము } మృత్యుమ్ జయులుగా కూడా మారవచ్చు . మంచి కీర్తి ప్రతిష్టలు కలవారు మృత్యుమ్ జయులు అయినట్లే

కదా? కీర్తి కాయము కొరకే కదా జనులు తాము సంపాదించుకున్న డబ్బుని కీర్తి ప్రతిష్టల కోసం ఖర్చు చేసుకోవటం ? దానిలో భాగంగా దాన ధర్మాలు చేయటం గుడులు బాగు చేయించటం వంటి పనులు చేయటము ? }

టిబెటియన్ బౌద్ధము పై సంగతులు చెప్పి - దాని - సాధనా మార్గాలు కూడా నిర్దేశించింది . ఈ సాధన అనేది - క్రమముగా పలుచబడి - ఒక నిద్ర పోయి లేచి - ఆ నిద్రలో వచ్చిన కలకు ఎదో ఒక అద్భుత కల్పన జోడించి - అవి తాము సాధన ద్వారా ఒక శరీరము లోనుండి ఇంకో శరీరము లోనికి మారుతున్న పుడు - పొందిన అనుభవాలుగా చెప్పటం బౌద్ధ సన్యాసులకు పరిపాటిగా మారింది . ఇలాంటి అనుభవాలు బౌద్ధ సన్యాసులు తమలో తాము మాట్లాడుకోవటానికి పనికి వచ్చాయి కానీ , ప్రజల హేళనకు గురి అయ్యాయి . ఏది ఏమైనా - మూడవ శరీరము లోనుండి ఒకటవ శరీరంలోనికి పోవటమే బుద్దిస్టుల యొక్క మొదటి ప్రాధాన్యం గా మారింది

ఆ తరువాత  బుద్ధిజం రొండో ప్రతిపాదన చేసింది  --మానవ శరీరాల లో Earth, water, fire, air, and space అనే ఐదు మూలకాలు వున్నవి . శరీరానికి ఈ ఐదు మూలకాలతో ఉన్న సంభందం  రద్దు పరుచుకునే విధంగా ధ్యానం చేయాలి . ఇదికాదు అంటే -మానవులు ఎప్పుడూ కూడా అయిదు విషయాల పట్ల మోహముతో ఉండి వాటిని పట్టుకొని వేలాడుతూ వుంటారు   . అవి  [01] రూపము =చక్కని రూపముతో కనపడాలి - దానితో  ఎదుటి వారిని మెప్పించాలి అని (02.) (vedana) వేదన =ఎవరినుండో లభించ వల్సిన మానసిక భావాల కోసము  ఎదురు చూడటము =  { వారు నన్ను పొగడాలి/ నన్ను మెచ్చుకోవాలి అనే ఆలోచనలు కలిగి వుండటము }  {03 } (సంజ్ఞ= సంజన =ఉన్న జ్ఞ్యానేంద్రియాలను ఉపయోగించుకొని - ఇంకా ఎదో చూడాలి అని వినాలి అనేకోరిక  {04.} vanjana = వంజన =  తెలివిగా ఉన్నట్లు - జ్ఞ్యానముతో ఉన్నట్లు నడుచుకోవాలి అని {05.}  {formations } ఫార్మేషన్స్ = తాము మాట్లాడినదానికి ఒక రూపాన్ని ఇవ్వాలి అనే కోరిక తో నూ  వుంటారు .   కాబట్టి  ఈ ఐదు విషయాలతో  ఉన్న సంభందం  రద్దు పరుచుకునే

విధంగా కూడా ధ్యానం చేయవచ్చు .   { ఫార్మేషన్స్ గురించి  నా   వివరణ -ఒకరి కోడలు వుంది .  అత్తగారి ఇంటి గడప తొక్కను అని పలికి వేరు కాపురం పెడుతుంది . ఇహ ఆమె తన జీవిత పర్యంతము ఆ మాటను రూపములో చూపించటానికి  కట్టు బడి ప్రవర్తిస్తుంది  .తన ఫార్మేషన్స్ వలన ఎదుట వారికి ఎంత దుఃఖము కలిగిందో - అంత విజయము తనకు దక్కిందని మురుస్తుంది . .అందువల్ల ఫార్మేషన్స్ అనేది దుఃఖమును కలిగించేది మరియూ  వదిలించుకో వలసిన గుణము }

మనిషిలో వుండే ఈ ఐదు విషయాలు తరచూ కిందకీ పైకీ మారుతూ  ఉంటాయి . నదీ ప్రవాహములోని నీరు నిమిష నిమిషానికి  కి ఒక రకంగా మారినట్లు , పై ఐదు విషయాలు పైకీ కిందకి మారుతూ ఉంటాయి . సాధకుడు ఈ ఐదు  భావాలను కూడా రద్దు పరుచుకొనుటకు అనగా తనలో లేకుండా చేసుకొనుటకు గానూ సాధన చేయాలి  .
పై ఐదు విషయాలనూ  -  బయటికి  కనపడేవి - బయటకు కనపడనివి - అంటూ  రొండు విభాగాలు

చేశారు .  - బయటకి కనపడని విషయాలను చూపించటానికి అని బుద్దిస్టులు రహస్య మయమైన గుర్తులు కొన్ని  వాడారు  .  ఈ గుర్తులే తాంత్రిక బుద్ధిజం. ఆగుర్తులు టిబెటియన్ బుద్దిస్ట్ పెయింటింగుల్లో ప్రదర్శితమవుతాయి  .  పై ఐదు విషయాలలో -  కంటికి కనిపించే వి అన్నీ మన చివరి దశలో,  మన మెదడు / ఆత్మలోకి  కరిగి పోతాయి . కంటికి కనిపించని గుణాలు అన్నీ అనంత సూన్యములో కలిసి పోతాయి
.
గత జన్మ సంస్కారము - ఇప్పుడు గ్రహించిన జ్ఞ్యానము పై  ఆ ధారపడి ఈ రెండు పద్ధతులు అనగా పంచభూతాలనుండి విడిబడటం - లేదా ఐదు స్వభావాల నుండి విడి బడటం సాధ్యమై ---- గొప్ప ఫలితాలను ఇస్తాయి .

సేకరణ సమర్పణ వారణాసి శ్రీరామ కృష్ణ ఆఫ్ అమరావతి .

## బుద్దిస్టులు చేసే ధ్యానము దేని గురించి ?   10-05-29

అయిదు విషయాల పై మనుషులకు విడరాని మోహము ఉంటుంది {[01 } రూపము =చక్కని రూపముతో కనపడాలి - దానితో ఎదుటి వారిని మెప్పించాలి అని
(02.) (vedana) వేదన =ఎవరి నుండో లభించ వల్సిన పొగడ్తలు . మెచ్చుకోలు వంటి మానసిక భావాల కోసము ఎదురు చూడటము
{03 } (సంజ్ఞ= సంజన =ఉన్న జ్ఞ్యానేంద్రియాలను ఉపయోగించుకొని - ఇంకా ఎదో చూడాలి అని వినాలి అనేకోరిక ( నేటి రోజుల్లో టీవీ చూడాలనే కోరిక }
{04.} vanjana = వంజన = తెలివిగా ఉన్నట్లు - జ్ఞ్యానముతో ఉన్నట్లు నడుచుకోవాలి అని { నేను ముందే అనుకున్నాను , నేను అప్పుడే చేప్పాను, ఇట్లా అవుతుంది అని నాకు ముందే తెలుసు --వంటి మాటల వెనుక వుద్దేశ్యము }
{05.} {formations } ఫార్మేషన్స్ = తాము మాట్లాడినదానికి ఒక రూపాన్ని ఇవ్వాలి అనే కోరిక తో నూ వుంటారు .అనగా వచన బద్ధులము కావటము.
[అనగా చేదు ఫలితాలు వస్తున్నపుడు కూడా నా మాటకు తిరుగు లేదు అని చెప్పటం ]

మోక్షం కోరువారు లేదా దుఃఖము లేకుండా జీవించ దలిచిన వారు ఈ ఐదు విషయాలతో ఉన్న సంభందం రద్దు పరుచుకునే విధంగా ధ్యానం చేయవలే .
పై ఐదు విషయాలూ - నీటి లోని నీటి బిందువుల లాగా - మానవులలో ఉంటాయి . వేటికి వాటిని విడతీసి చూడటానికి - చూచి లబ్ధి పొందటానికి ధ్యానము అనేది అవసరము . ధ్యానము ద్వారా వీటిని విడదీసి చూసి నపుడు అనగా ఆ విషయాల గురించి లోతుగా తర్కించుకొన్న కొద్దీ, ఆవిషయాలలోని డొల్లతనం బయట పడి అనంతమైన సూన్యము తప్ప నిజమైనది ఏమీలేదు అనే భావనను పొందుతాము.
మరణానంతరము మనము సంపాదించినది అంతా సూన్యము అవుతుంది . ఆ సూయాన్ని ముందే గ్రహించుకొంటె అనవసర యాతనలు తప్పుతవి కదా ?
అందుకని సూన్యము అనే భావాన్ని గ్రహించటానికి ధ్యానము చేయమన్నారు .

ఈ సూన్యము= నాలుగు రకాలు .
మొదటిది = బయట కి చూపుటకు ఆచరించే పనులు ఇచ్చే ఫలితము సూన్యము

02. = మనసు తృప్తి కొరకు  ఆచరించే పనులు ఇచ్చే ఫలితము సూన్యము
03 - పై రొండు భావాల కలగలుపు కారణాల వల్ల చేసిన పనులు ఇచ్చే పనులు సూన్యము
04 .సూన్యతా సూన్యత = అసలు ఏమీ లేదు = సర్వమూ సూన్యము .

మరి  సూన్యము ను గురించి  నాలుగు సూన్యలుగా ఎందుకు విడ దీసి చెప్పినట్లు - అంటే ? ఏమీ లేదు ఏమీ లేదు అను భావము తెచ్చుకోవటం అంత సులువు కాదు. కాబట్టి -- ఒక్కొక్క సూన్యాన్ని దాటుకుంటూ - వచ్చి,   ఆపై  ఏమీ లేదు వున్నది  సర్వ సూన్యము అనే భావము లోనికి ప్రవేశించటం సులువు కాబట్టి ఆలా నాలుగు విభాగాలు చేసి చెప్పారు .
సర్వమూ సూన్యము అని తెలుసుకో గోరిన  వారు యోగిగా మారి మూడు మొదటి మూడు సూన్యాలనూ దాటాలి . ఆ సూన్యములు దాటినపుడు వచ్చే స్థితులు కూడా వున్నాయి
మొదటిది (anupaśyati) అనుపశ్యతి = అక్కడ వున్నది గానీ అది నాది కాదు అనే భావన { అక్కడ ఒక

చాకోలెట్ వున్నది కానీ అది నాది కాదు ఎవరిదో అనుకోని జిహ్వాను అదుపు చేసుకున్నట్లు }
రొండొవది -- (āryāṣṭāṅgamārga) ఆర్యష్టాంగమార్గ - అనగా దుఃఖాన్ని దూరము చేయగల ఎనిమిది మార్గాలు లేదా దారుల పట్ల గ్రహింపు కలిగిన స్థితి,
మూడవది (sopadhiśeṣanirvāṇa).= సోపాదిసేసనిర్వాణ =అనగా మోక్షమునకు మొదటి మెట్టు వంటి స్థితి
ఈ మూడు స్థితుల తరువాత దుఃఖము అనేది చని పోయి, దాని చోటులో నిర్వాణము అన్నది మిగులుతుంది .{చెక్క కాలి పోయి కాంతి వంతము అయిన నిప్పును వదిలినట్లుగా - దుఃఖము చనిపోయి నపుడు నిర్వాణము / మోక్షము మిగులుతుంది .నిర్వాణము యొక్క మొదటి మెట్టు చేరిన స్థితికి -- గత జన్మల పుణ్యము తోడుగా వున్నపుడు మరల మరల పుట్టుక అన్నది లేని మోక్షము పోతుంది .

బుద్ధిజం ఎన్ని చెప్పినా గాని "గత జన్మ ప్రభావాలు ఈ జన్మ మీద పడుట" అన్న ఆలోచనను వీడదు . అందువల్ల మనకు దొరికిన జన్మలోనే బుద్ధుని బోధనలు ఆచరించి - ఆ పై జన్మలో - జన్మ రాహిత్యానికి కృషి

చేయాలి . ఒకే జన్మలో మోక్షము ను ఆశించ రాదని దీని భావం ,

ఇప్పుడు గ్రహింప గలిగాము . బౌద్ధ సన్యాసులు విషయాల మీద మోహము వీడి - సూన్యలను అనుభూతి చెందటానికి. ఆపై నిర్వాణము చెందటానికి అని ధ్యానము చేస్తారు .

మరి మీరూ నేనూ అంతా సూన్యము = అనుకుంటూ కూచుంటే ఎట్లా ? అన్న ప్రశ్న వచ్చింది . మనశరీరమునకు ఒక రోగము వచ్చినది అని నింపాదిగా తెలిసినట్లుగా -- సూన్యత అనేది వున్నది అని మనకు ఎప్పుడో ఒకప్పుడు - నింపాదిగా తెలుస్తుంది , మనకు వచ్చిన రోగము కోసము వాడే మందును ఎప్పుడు ఆపాలో అనేది కూడా శరీరమే చెపుతుంది . . అదే విధంగా " ఏమీ లేదు " అన్న ఫీలింగును ఎక్కడ ఆపు కోవాలో కూడా ఆత్మయే చెపుతుంది అని వివరణ ఇచ్చారు

సేకరణ సమర్పణ వారణాసి శ్రీ రామ కృష్ణ అఫ్ అమరావతి -

-----------------------------------------------------------------
-

NOTE -- ఇప్పటి వరకూ నేను రాసినది అంతా BARDO  THODAL అనే టిబెటిఎన్ పుస్తకానికి పూర్వరంగము . ఆ పూర్వ రంగము ఇక్కడితో పూర్తి అయినది .

నేను నాకు గల ఆసక్తిని అనుసరించి కొన్ని బౌద్ధ గ్రంధాల సారము ను ప్రజలకు తెలుపదలుచుకున్నాను . నా కృషికి మీ తోడ్పాటు అవసరము . నా ప్రాజెక్ట్ ని కొనసాగించుటకు ఒక సహాయకుని నియమించుకుంటున్నాను . మీరు ఏదన్నా ఆర్థిక పరమైన సాయము అందించ వచ్చు  . నా ఫోన్ పే నంబర్ **9908482191** .ఇందులో బలవంతము ఏమీ లేదు ఎంతైనా సరే ఒకే

సేకరణ సమర్పణ వారణాసి శ్రీ రామ కృష్ణ అఫ్ అమరావతి

## టిబెటియన్ భాషలో ని బుక్ అఫ్ ది డెడ్ సారము

## Part -1 ON 27-4-24

.

తొలుత టిబెటియన్ భాషలో వ్రాయబడి -ఇంగిలీషు లోకి అనువాదం అయి- ఎందరికో నచ్చిన " ది బుక్ అఫ్ ది డెడ్ " అనే బౌద్ధ గ్రంధము వున్నది - ఇది దాని సారము . "ది బుక్ అఫ్ ది డెడ్ " అనే ఈజిప్టు గ్రంధము కూడా వున్నది . దాని సారము ఏమిటో నేను ఇదివరకే రాసాను. దాని డిజిటల్ కాపీ అడిగిన వారికి ఉచితంగా పంపుతాను .

టిబెటియన్ బుద్ధిజంని వజ్రయాన బుద్ధిజం అంటారు . వజ్రయాన బుద్ధిజం హిందూ నమ్మకాలని తన లోనికి పీల్చుకున్నది. అందువల్ల ఇది మీకు హిందూ గ్రంధంగా కూడా కనపడవచ్చు . మీకు తెలిసిన హిందూ ధర్మాల ఆధారంగా దీనిని విమర్శించ వద్దు.

ఈజిప్టు వారి ప్రకారం - మనిషి హృదయము అతడు చేసిన మంచి పనుల కారణంగా { గుండె } తేలికగానూ , చెడుపనులు కారణంగా బరువుగాను మారుతుంది . చని పోయిన పిదప ఈజిప్టు వారి దేముడు హృదయాన్ని

ఒకవైపు - పక్షి ఈకను మరొక వేపు పెట్టి తూకం తూస్తారు . పక్షి ఈకకు సమానముగా తేలికగా వున్న హృదయాన్ని స్వర్గంలోకి - బరువుగా ఉన్న దానిని కిందకు పారవేస్తాడు .ఈ పారవేయబడ్డ హృదయాన్ని తిని వేయటానికి అని ఒక తోడేలు { నరకము } అక్కడనే కాచుకొని ఉంటుంది .

ఇహ ఈ టిబెట్ వారి దేముడు కూడా మరణానంతరము మానవ హృదయాన్ని తూకం వేస్తారు . తూకం వేసే దేముడు, ధన కనక వస్తు వాహనాలకు లొంగడు . కానీ ఆయనయే మృతుని క్షమించ దలిచినపుడు - తాను పట్టుకున్న త్రాసులో ని దండాన్ని తాను క్షమించి న వారికి మేలు జరిగేట్లు గా వంచి పట్టుకుంటాడు. ఇక్కడ కూడా ఒక తోడేలు ఉంటుంది . అది, దేముడు మానవ హృదయాన్ని కింద పడవేసి దాకా వేచి ఉండక , దేముడు త్రాసును పట్టుకున్న తీరును బట్టి తానే అంతా గ్రహించుకుని ఆ హృదయాన్ని తీసుకుని తినేస్తుంది .{ అనగా నరకము అతనిని తనలోకి లాగి వేసుకుంటుంది }

ఎక్కడనో వున్నా ఈజిప్ట్ వారి భావనలూ, ఇక్కడ నే వున్న టిబెట్ వారి భావనలు ఒకే దరి దాపుల్లోకి వచ్చి

ఆగాయి . ఇలాగా ఎవరి భావనలో వచ్చి హిందూ భావనలకు దెగ్గరలో ఆగుతవి , ఇదే కారణం వాళ్ళ పేరే వారుకూడా హిందూ భావనలు మన భావనల వాలే వున్నవి అనుకుంటానికి కూడా వీలుంది .

టిబెటియన్ భాషలో ది బుక్ అఫ్ ది డెడ్ అనే బౌద్ధ గ్రంథము వున్నది -ఇది దాని సారము . ది బుక్ అఫ్ ది డెడ్ అనే ఈజిప్టు గ్రంథము వున్నది . దాని సారము ఏమిటో నేను ఇదివరకే రాసాను. టిబెటియన్ బుద్ధిజంని వజ్రయాన బుద్ధిజం అంటారు . వజ్రయాన బుద్ధిజం హిందూ నమ్మకాలని తన లోనికి పీల్చుకున్నది. . అందువల్ల ఇది మీకు హిందూ గ్రంథం గా కూడా కనపడవచ్చు .మీకు తెలిసిన హిందూ ధర్మాల ఆధారంగా దీనిని విమర్శించ వద్దు.

"bardo thodal " అనే పుస్తమునీనుండి సకరించి ఇప్పుడు నేను రాసేది అంతా కూడా "చనిపోయినాక దేముడి నుండి క్షమాపణలు కోరి నరకము తప్పించుకోవటం ఎలా? అన్న దాని గురించినది ఐ ఉంటుంది .

ఈ పుస్తకము లోని విషయాలను , పద్మసంభవుడు లోకానికి తెలియ చేసాడు అని . చెబుతారు . పద్మసంభవుడు మొదటిలో హిందువులకు తాంత్రిక గురువుగా ఉండి తరువాత బుద్ధిజం ను ప్రచారం చేసాడు . ఆయన చెప్పిన విషయాలను 14 వ శతాబ్దములో గ్రంథస్థము చేయగా , ఇంగిలీషు వారు దీన్ని చదివి మనకు తెలియ చెప్పారు .
టిబెటియన్ బుద్ధిజం ప్రకారం చని పోవటం కూడా ఒక నేర్చుకో వలసిన ఒక కళ . { అంటే చిత్ర కళ లాగా } చని పోవటం అంటే వూరికే అయ్యే పని కాదని, చని పోయినాక కూడా ఆత్మ చేయవలసిన పనులు కూడా ఉన్నవని , ఆ పనులు మనము ముందుగానే చక్కగా నేర్చుకోవాల్సి వున్నదని దీని అర్ధము .

బుద్ధుడు-- మరణం నుండి తప్పించుకునే మార్గము ఏమిటో కనుగొనలేకపోయాడు . కానీ మరణము అంటే భయము లేకుండా ఉండేట్లు కొన్ని సంగతులు చెప్పాడని , వాటినే పద్మ సంభవుడు తిరిగి ని ర్వచించాడని అనుకోవచ్చు.

చని పోయిన మనిషి ముందుగా Bardo { బార్డో అనే టిబెటియన్ మాటకి అర్ధము చావుకి తిరిగి పుట్టుటకు గల మధ్య వ్యవధి } లోనికి వెడతాడు . . అతడు అక్కడ 49 రోజుల కాలము గడుపుతాడు .ఈ 49 రోజుల కాలము ఆరు విభాగాలు గా విభజింప బడింది . ఈ 49 రోజుల కాలములో -- ఎవరు ఏ విభాగములో ఎంతకాలము వుంటారు అన్నదానికి కాల నిర్ణయము లేదు .

01 - స్టేజీ --Kyenay bardo - అనగా చివరి ఊపిరి తరువాత మొదలు అయ్యి. బుద్ధి అనేది శరీరము నుండి వెళ్లిపోయే కాలము .ఇప్పుడు మృతుడు స్వచ్ఛమైన వెలుగును చూస్తాడు

02 - స్టేజీ- Milam bardo (rmi lam bar do) ఈ కాలములో మృతుడు ధ్యానము ద్వారా తనకు కనపడిన వెలుగులో వున్న బుద్ధుని రూపం దర్శించుకోవాలి .దీని కోసము గానూ బ్రతికి ఉండగానే ఆ ధ్యానపు పద్ధతులు నేర్చుకోవాలి .{ టిబెటియన్ మాంక్స్ చేసే ధ్యానము దీనికే నా ?"} { మనము రోజూ చేసే పూజల ఉదేశ్యము కూడా ఇదే నా ? ]

03 -   స్టేజీ  = Samten bardo =  బ్రతికి ఉండగానే ధ్యానపు  పద్ధతులు ఏవీ కూడా నేర్చు కోని సామాన్యులు  ఉంటే - వారికి ఈ కాలములో అప్పటి కప్పుడు కొన్ని సాధనా మార్గాలు స్ఫురిస్తాయి .ఏదిఏమైనా బ్రతికి వున్న కాలంలో నేర్చుకోవటమే ఉత్తమము .

04 .నాలువ స్టేజీ = Chikhai bardo ('chi kha'i bar do) ఈ స్థితిలో చావు అనేది మనను వీడిపోయిందని { మనకు పునర్ జన్మ లభించ నున్నది అని అర్ధము }   - మనకు ఊపిరి ఊదిన వారు ఎవరో--  వారి దగ్గరకు పోతున్నామని -- వారు మనకు మరలా ఊపిరి పోస్తారు అన్న స్పృహ కలుగు తుంది .

05 . స్టేజీ = Chönyi bardo (chos nyid bar do)  ఈ కాలములో మృతినిలో ఆగిన ఊపిరి తిరిగి అందుతుంది . ద్రుష్టి మరియు వినికిడి శక్తీ తిరిగి లభిస్తాయి . అంతా చక్కగా ఉన్నట్లు - అనంత మైన స్వరూపము ఒకటి వున్నదని - అనంత మైన శాంతి ఒకటి వున్నదని గ్రహింపు కలుగుతుంది  .కానీ -  తాము బ్రతికి వున్న

కాలము లో ఏ ఆరాధనా  చేయని వారు- తాము చూసిన చివరి    విషయాలను  చూసి కూడా ఆ  వెంటనే మరిచి పోతారు   .    .

06 . స్టేజీ= Sidpa bardo (srid pa bar do) బుద్ధిజం సాధన చేసిన వారు మాత్రమే ఐదో స్టేజీ దాటి ఈ ఆరో స్టేజీలోకి వస్తారు .వీరు పునర్జన్మ పొందినాక  వీరికి తాము చూసిన కాంతి మరియూ  శాంతి ని గురించి జ్ఞపకాలు ఉంటవి .  పునర్  జన్మ  లభించాక మరిన్ని ఉత్తమ కార్యాలు చేస్తారు .

సమర్పణ వారణాసి శ్రీరామా కృష్ణ అఫ్ అమరావతి

Part -2

కుక్కను మనము కరవలేము - కానీ కుక్క మనలను కరుస్తుంది . అనే పోలిక ప్రకారము మృత్యువును మనము ఏమీ చేయలేము కానీ అది మనలను ఏమైనా చేయ గలదు . మృత్యువు అనేది అందరినీ కరుచుటకు సృష్టి అయినట్టి  కుక్క - దానికి ఇనుప గోడలు , కోటలు

అడ్డము కాదు.    కాబట్టి దాని ముందు మంచిగా  - కాలము గడపటమే  ఉత్తమ మార్గము.

 మన పూర్వీకులు -" పొలిమేర లోని కుక్కలు,  ఊర కుక్కలు రాత్రి అంతా తెగ ఏడ్చినవి - యములోరు వచ్చి ఉంటాడు - కాలభైరవుడు ఎవరింటికి దారి చూపాడో ఏమో " అనుకుంటూ ఉండేవారు . అందుకని నేను అలా పోల్చాను  { కుక్క మృత్యువుకు బంటు గా ఉండి యమ భటులకు పట్టుకు పోదలిచిన వ్యక్తి ఎక్కడ వున్నదీ జాడలు తీసి ఇస్తుంది అని , .కుక్క కు వున్నా ఈ వాసనా పటిమ ఏ తమకు శ్రీ రామ రక్ష అని - యమ భటులు ఎవరినో పట్టుకు పోవటానికి అని  వచ్చి పొరపాటున { పేరు ఆకారం వయస్సు ఒకటే అయినపుడు గుర్తించటంలో జరిగే పొరపాట్లు  }  తమని పట్టుకుపోకుండా చూస్తుంది అని  మనవారికి    ఒక నమ్మిక  .  కుక్క ను గనుక మృత్యువుకు బంటుగా చేసి ఆరాధిస్తే,    అది ఆ పూజలు పొందిన విశ్వాసముతో, మరియూ  తన వాసన చూసే శక్తిని కలగలిపి  - కరెక్టు వ్యక్తికి ఇంటికే దారి చూపి జనులకు అకాల / అకస్మాత్తు మరణాలను ఆపుతుంది కదా ?  అనే ఆలోచనతో మనవారు   దానికి కాల  భైరవుడు అన్న పదవి   ఇచ్చి

ఒక దేముని చేసాబు ? - కుక్క ఒక భిన్నమైన శబ్దం చేసినపుడు అది దాని ఏడుపు అని - అది తన ఏడుపుద్వారా మృత్యువు రాకడను మానవులకు తెలిపి , మానవుల పట్ల తన విశ్వాసం కనపరుచుకుంటూ ఉందని అని నమ్ముతారు }

BARDO THODAL గ్రంధము ప్రకారము చని పోయిన వారు ఆరు రకాల రూపాలలో మాత్రమే తిరిగి జన్మిస్తాము .01 .దేవీ లేదా దేమునిగా 02 . దేవతలకు సరిసమానము అనతగ్గ రూపంలో{ఏంజెల్స్ } , 03 . అది కాక పోతే మానవులుగా - 04 .అదీకాక పోతే జంతు వు గానూ - 05 .అదీకాక పోతే ఎప్పుడూ ఆకలితో ఏడుస్తూ తిరిగే దుష్టశక్తి గానూ - { అందుకే దుష్టశక్తులు విపరీత మైన ఆహారము సమర్పిస్తారు - ఉదాహరణ - ఏకంగా ఒక దున్న పోతునే బలి ఇవ్వటం } 06 . ఇక చివరిగా నరకంలో వుండే భయంకరమానవుల / జంతువుల రూపం లోనూ పుడతాబు .{ మన హిందూ నరకములో మనిషిని భాండీలో వేసి వేయించేది మనిషిని పోలిన యమ దూత ఏ కదా ?} ఇవీ మృతునికి అతడు చేసుకున్న పాప పుణ్యాల ను బట్టి లభించే పునర్జన్మల వరుసక్రమం.

పాపికి మరో అవకాశం ఇవ్వాలి అన్న మంచి ఉద్దేశ్యము తోనూ , మీరు మనిషి రూపములో ఉంటే తప్పు ఏది తెలుసుకో లేరో అది తెలుసు కునేటందుకు వీలు కల్పించే ఉద్దేశ్యము తోనూ, మనము అడిగినా అడగక పోయినా కూడా దేముడు మనిషిని తిరిగి మనిషిగా సృష్టి చేయటానికే ప్రాధాన్యం ఇస్తాడు. మనుష్య జన్మ కోసం వేరే సాధన ఏమీ అవసరము లేదు . మనిషికన్నా ఉత్తమ జన్మ పొందటానికి మరియూ మనిషి కన్నా నీచ జన్మ, తప్పించుకునేందుకు మాత్రమే సాధన అవసరం . { కొందరికి క్షమా భిక్ష పెట్టి జైలు నుండి విడుదల చేయటము అనేది - వారు మంచీ చెడూ తెలుసుకునే అవకాశము ఇవ్వాలనే }

పై, రెండింటి ప్రకారముగా చూస్తే మృతుడు నేరుగా నరకములో నికి పోడు. కానీ పునర్జన్మలలో భాగంగా నరకంలో జన్మిస్తాడు . నరకము వున్నది కానీ అది పునర్జన్మలకోసమే వున్నది . శిక్షల కోసము కాదు .

పునర్ జన్మలు ఎట్లా నిర్ణయం అవుతాయి ? మంచి కర్మ { పని } వల్ల మంచి జన్మ - చెడు కర్మ{ పని } వల్ల చెడు

జన్మ లభిస్తాయి . ప్రతి  మనిషికి అతడి చివరి జీవితపు రోజులు ముఖ్యమైనవి . ఆ రోజుల్లో వారు ఏ  పనులు చేస్తూ జీవితం ముగిస్తారో ,తిరిగి జన్మించాక అవే  పనులు చేస్తూ జీవితం మొదలు పెట్ట  వలసి  వస్తుంది . చివరి రోజుల జీవితం పుణ్యవంతముగా  ఉన్నంత మాత్రాన పాత పాపాలు  రద్దు అయి - కొట్టుకు పోవు .కొత్త   జన్మ సుఖంగా { పాలు, ఆహారము అన్నము వస్త్రము వంటివి అనుభవిస్తూ } ఓరారంభము చేయటానికి మాత్రమే పనికి వస్తాయి .  మంచిగా మొదలైన జీవితము ఇంకా ఎంతో మంచి  జీవితమునకు  మార్గము  కల్పిస్తుంది కదా ? . బధిరుడిగా   పుట్టిన పిల్లవాడు ఎన్ని ? , ఏ ?  మంచి విద్యలు నేర్వగలడు ?  మంచి పుట్టుక పుట్టి , మంచి విషయాలు చూపే  దారిలో ప్రయాణించే వారు "మైత్రేయుడు"  అనే రాబోయే కాలపు బుద్ధుని రోపాన్ని తమ జీవితకాలంలోనే  దర్శిస్తారు
హిందూ మతము ప్రకారము జీవితము నీటి బుడగ . అనగా క్షణ కాలంలో జీవిత  సుఖాలు ముగిసి ,  మరణం చేరువలోకి  వస్తుంది .   బౌద్ధుల ప్రకారము మరణ మే నీటిబుడగ . అనగా అనగా క్షణ కాలంలో లో మరణ  దశ ముగిసి  పునర్ జన్మ లభిస్తుంది .

భూమిలో విత్తనము ను నాటిన తీరును బట్టి, దాని మొలక శాతము, మొలక తీరు నిర్ణయము అయినట్లు - మనిషి ఎటువంటి స్థితిలో మరణించాడు అనే దాని ని పట్టి అతని యొక్క మరో జన్మ మొదలు అవుతుంది . ఒకరు చని పోయేముందు మనము కనుక వారిని ప్రశాంతముగా వుంచగలిగితే వారు ప్రశాంతముగా పునర్జన్మిస్తారు . { అందువల్లనే " అతని ఆత్మకు శాంతి కలుగు గాక అని మౌనము పాటిస్తాము - మౌనము అన్నది మనము కూడా ప్రశాంతముగా ఉన్నామని సూచిస్తుంది } --- మరణించే వారికి ప్రశాంతత అందించటం కోసమని వారి సమీపంలో వారి కిష్టమైన {మత} విషయాల స్మరణ జరగాలి . { అందుకని పెద్ద పెద్ద రాజకీయ నాయకులు చనిపోయినపుడు సర్వ మత ప్రార్ధనలు జరుపుతారు. ఆయన తన మనస్సులో ఏమతము అంటే ఇష్ట పడుతున్నాడో తెలియ నివ్వకుండా - చేమత్కారం గా కాలం గడిపినందువల్ల - ఈ సర్వ మత ప్రార్ధనలు పుట్టాయి .} చని పోబేయే వారి సమీపములో బుద్ధుని ప్రతిమ, చక్కని పూలు అందుబాటులో ఉంచాలి . వారి ఎదురుగా మండలము లేదా కాల చక్రము యొక్క పఠాన్ని ఉంచాలి . దీని ద్వారా వారు మరణా నంతరము తమ కు లభించగల

పునర్ జీవితాన్ని ముందే చూడగలుగుతారు . ప్రశాంత చిత్తులు అవుతారు .
అవకాశము దొరికినంత వరకూ బౌద్ధ సన్యాసిని ఆహ్వానము చేసి అతని ని మరణించ బోయే వారి పక్కనే ఆసీనుల ని చేయాలి . ఆ సన్యాసి కి మృతుని గురించి , అతడు చేసిన ఉన్నత కార్యాలగురించి, లోకోపకారాల గురించి వివరించి చెప్పి - అతని చేత వాటిని మరల మరలా వల్లింపచేయాలి . ఇది సాధ్యము కానపుడు {అనగా అయన చేసిన మంచి పనులు గుర్తించిన వారు ఎవరూ లేనపుడు } "మహామంగళ సుత్త ము" అను దానిని వల్లే వేయాలి . మంగళము అనగా ఆశీర్వచన ము అని అర్ధము . మంగళ హారతి అనగా ఆశీర్వచనపు హారతి . చని పోయే వారికి ఇచ్చే ఆశీర్వచన ము ఏ "మహామంగళ సుత్త ము"

మహామంగళ సుత్త ము" -- ఓ మృతుడా అనేక రకములైన స్వర్గ దేవతలు - నీకన్నా ఉన్నతులు ఐన మనుజులు ఉండిరి . వారిలో ఉత్తములు ముఖ్యులు నిన్ను ఆశీర్వదింతురు గాక . నీవు తిరిగి జన్మించునపుడు - నీవు తెలివి తక్కువ వారి మధ్య కాక - తెలివి గల వారి మధ్య నూ , గౌరవ హీనుల మధ్య కాక

గౌరవము కలిగిన  వారి మధ్య జన్మించునట్లుగా వారు ఆశీర్వ దింతురు "  అనుచెప్పును .

దీని పిదప  , " కరణీయమేత్తా సుత్తము"  మరియు" రత్న సుత్త" మును కూడా చదవవచ్చును .
" ప్రాణముతో ఉన్న ప్రతి దానిని - అలాగే ప్రాణము వదిలిన ప్రతి దానినీ , అది గొప్పదా ?  లేదా నీచమా ?  , బలము కలదా ? లేనిదా ?తన విన్నపము లు తాను చెప్పగలిగి ఉన్నదా  ? లేదా?" అన్న  భావనకు లోబడక ప్రతి ఒక్కటీ కరుణా దృష్టితో చూడబడుతుంది . స్వేచ్ఛగా ఆలోచించ గలుగుతున్న స్థితిలో ఉన్నవారూ - లేక అచేతనులుగా పడి ఉన్నవారూ - ఇలా ఎవరైనా సరే - బుద్ధునియొక్క  కరుణా దృష్టికి దూరముగా ఉండరు" అని కరణీయమేత్తా సుత్తము లోని సారము  .
"  Ratana సుత్త" అనునది బౌద్ధములో ఉన్న త్రిరత్నముల గురించి కీర్తించునది .  త్రి రత్నములు అనగా  (1) బుద్ధుని బోధనలు -  పాళీ భాష లో వున్నవి , (2} ధమ్మ బోధనలు అనగా బుద్ధుని యొక్క అగ్రగణ్యులైన భక్తులు చెప్పినది - (3)  బుద్ధుని వెంట నడిచిన శిష్యులు చెప్పినది     --  వీటిని మృతి పొందు వారికి వినిపింప వలెను . బుద్ధుని అమితాభుడు అన్న

రూపమున పూజించు వారు ఆ నామమును పలక వచ్చు . ఇవి అన్ని కూడా మనుషుని యొక్క చివరి క్షణపు కాలనీ అమృత మయము చేస్తాయి అని వూహ .
సేకరణ వివరణా వారాణసి శ్రీ రామ కృష్ణ -- అమరావతి

**Part-3- ON 1-5-24**

హిందూ మతము ఏ మొదటిది . కాబట్టి హిందూ మతము యొక్క భావజాలం బుద్ధిజం లోనికి అనివార్యముగా ప్రవేశించినది . అందువల్ల బుద్దిస్టులు చేస్తున్న ఏదైనా ఒక ఆచారపు పని - హిందూ మతానికి దగ్గరగా ఉంటుంది . చాలా సందర్భాలలో హిందూ ఇజం ఒక వ్యక్తి మృతి చెందినాక చేయాలి అని చెప్పిన పనులు - బుద్ధిజంలో ని వ్యక్తి మృతి చెందటానికి ముందు గా చేయవలిసిన పనులు గా మార్చి చెప్ప బడతాయి . ఈ విషయం దృష్టిలో పెట్టుకుంటే - ఈ వ్యాసము మీకు సులభంగా అర్ధము అవుతుందని నా వూహ.

<> చని పోయేవారు చేయాల్సింది ఏమైనా ఉందా ? <>

ప్రత్యేకించి ఏమీలేదు . తాము జీవితకాలంలో చేసిన ఉన్నత కార్యాలు ఇక ముందు కాలం లో కూడా కొనసాగే విధంగా ఏర్పాట్లు చేయాలి . తాను సన్మానించ దలచిన వ్యక్తులను పిలిపించుకోవాలి . { హిందూయిజం లో ఇది మృతుని మరణానంతరం బ్రాహ్మణులకు ఇచ్చే సంభావన.) ఆతరువాత బౌద్ధ సన్యాసులను పిలిపించుకొని వారికి "అత్తా పరిక్ఖారా " (attha parikkhara) { అనగా -ఆరు పరికరాలు } ఇప్పించాలి . అవి (1) బౌద్ధ సన్యాసులు ధరించే దుస్తులు మూడు జతలు -- ఇందులో గోచీ లు మూడు - నడుము కిందకు వస్త్రాలు మూడు - భుజాల పైనుండి మోకాళ్ళ వరకూ వుండు వస్త్రాలు మూడు (2) ఒక భిక్షా పాత్ర {3} గుండు గీసుకునేందుకు ఒక చాకు {4} నీటి పాత్ర {5} బట్టలు కుట్టుకునే టందుకు సూది- దారము {6} నడుముకు కట్టుకునేది వెన్నుకు ఊతము ఇచ్చే బెల్టు లాంటి బట్ట , - వీటిని చనిపోయే వ్యక్తి అంగీకారంతో మాత్రమే ఇవ్వాలి . చని పోబోఏ వారు అప్పటిదాకా దీని గురించి ఏమి ఆలోచనలతో వున్నారో వాటిని కొనసాగించాలి .{ బౌద్ధ సన్యాసులు నిరంతరమూ ధ్యాన ముద్రలో లో వుంటారు కదా ? అందుకని వారికి వెన్నుకు సపోర్ట్ ఇచ్చే బెల్ట్ లాంటి వస్త్రం - అని నా వివరణ }

<>చని పోయఃబోయే వారికి ఏదైనా నెప్పి నివారణ మందు ఇవ్వవచ్చా **?** <>
నొప్పి నివారణ మందు కారణంగా మృతి చెందబోయే వారు  నిద్రా స్థితి లోకి జారకుండా వుండే మందు మాత్రమే ఇవ్వాలి .

చని పోబోయే వారి సౌకార్యాన్ని దృష్టిలో పెట్టుకుని - మరియూ  - వారు వారి లోని మంచి /చక్కని ఆలోచనలు కొన  సాగించుతూనే ఉండాలి అని కోరుకుంటూ  - వున్నపుడు మాత్రమే మనము-  వారికి నొప్పి నివారణ మందు ఇవ్వ వచ్చును . ఏ మందు ఇవ్వకుండా వారిని స్పృహలో ను ఆలోచనల లోనూ ఉండేటట్లు చూడటమే ఉత్తమము . బౌద్ధ సన్యాసి అయినవాడు చావుకు మందు ఇలాంటి మందులను ఆశించక ఉండాలి . { అనగా మరణములో ఏమి వున్నదో  అనేది అతడు స్పృహలో / మెలకువలో ఉండి గ్రహించాలి అని కోరారు -అని నా వివరణ }

**<>** మంచి మరణం అంటే ఏమిటి **?<>**

ప్రశాంతము గానూ  - శాంతిని పొందినట్లు గానూ ఉన్న మృతుని  ముఖ కవళికలు మంచి మరణానికి సూచిక . ఇవి ఆ మనిషి  తాను మంచి విలువలతో కూడిన నైతిక మైన , విజయవంతమైన , భాద్యతలు అన్నీ నెరవేర్చిన  జీవితం గడిపినట్లు భావించుకున్నాడు అని తెలియ పరుస్తాయి .  { నా వివరణ - దేముడు మరణానికి ముందు నిమిషము లో ఆ వ్యక్తి చేసిన మంచీ చెడూ పనులన్నింటినీ ఒక సినిమా ఫ్లాష్ బ్యాక్ లా గా చూపిస్తాడు . చూపి - " నీవు నీ పనుల పట్ల సంతసించావా ? లేక చింతించావా ? అని అడుగుతాడు . తన గత జీవితము సంతోషించ  తగినదిగా భావించిన మృతుని మొఖం ప్రశాంతముగా మారుతుంది . గతజీవితం గురించి పాప చింతనలో చింతించిన వారి మొఖం లోని కండరాలు  నరక భీతితో  మెలి తిరిగి పోయి ఉంటాయి .  మనము ఎవరమైనా మృతులను చూడటానికి వెళ్ళినపుడు వారి ముఖాలను చూసి వారు గడిపిన జీవితము అంచనా వేసుకొని రావచ్చు . ఒక వ్యక్తి మనకు తెలిసి నంతవరకూ  మంచి వాడు . కానీ అతడు ఇంకొకరి  నిజ జీవితములో వేరే రకపు మనిషి గా వున్నాడు .  అసలు అతను ఏ రకపు మనిషి  ? అనేది అతని మరణం తరువాత అతని ముఖ కవళికలు

తెలుపుతాయి -  - } { EVERT THING HAS  TO SAY SOME THING IF YOU ARE WILLING TO LISTEN }   అన్నది గుర్తు పెట్టుకోండి .

<>మృత్యువు -- బుద్ధ సన్యాసిని ఎలా సమీ పిస్తుంది ?<>

ఒక ఊపిరి విడిచిన తరువాత -  మరిఒక  ఊపిరి పీల్చ లేక పోవటం అనేదే    మృత్యువు . ఊపిరికి ఆకారం లేనట్లే మృత్యువుకు కూడా రూపం లేదు . అది గాలిలో వుంది . కాబట్టి గాలి వచ్చిన ప్రతి చోటుకూ రాగలుగుతుంది .  { నా వివరణ = హాస్పిటల్ లోని  వారు " ఆక్సిజన్ పెట్టాము . అది తీయగానే రోగి మరణిస్తాడు " అని  చెబుతూ వుంటారు. కాబట్టి మృత్యువు అనేది గాలిలో నే వుంది }

బౌద్ధ సన్యాసికి , తన ఆఖరి ఊపిరి గురించి అంచనా దొరుకుతుంది .చివరి ఊపిరి తరువాత ఏమి వున్నది అన్నది కూడా ముందే తెలుస్తుంది .ఇంతకు మించి అతనికి వేరే మినహాయింపులు ఏమీ లేవు అని .

## <>మృతుని దేహానికి  ఎమన్నా చేయటం అవసరమా ?<>

వారు బౌద్ధ అనుమాయిలు అయితే వారి  చేతి వేళ్లను, వంకరలు లేకుండా సాఫీగా సరి చేయాలి . కాలి బొటన వేళ్లను  దెగ్గరగా కలిపి కట్టి వేయాలి . బుద్ధిస్టుల ప్రకారము-  దేహము ఒక ఇల్లు లేదా దేవాలయము - దాని తలుపులు మూసి వేసి నాము అని చెప్పుట ఏ కాలి బొటన వేళ్ళు దెగ్గరగా కట్టుట లోని  అర్ధము . మృతుని తల పశ్చిమ దిక్కుగా ఉంచాలి . మృతుని దేహము పూర్తిగా చల్ల పడేవరకూ లేదా మూడు రోజుల వరకూ లేదా అంతకు తక్కువలో   వీలున్నంత కాలముపాటు  తాక రాదు - కదల్చరాదు .{ మూడు రోజులు ఎందుకు అనేది చాలా విస్తార మైన సంగతి కాబట్టి తరువాత తెలుపుతాను } మృతుని   తాకుటకు ముందు బుద్ధుని నామము స్మరించి - జపించాలి .బుద్ధునికి పండ్లు పూలు దీపము ధూపము తెల్లని వస్త్రము సమర్పించాలి. బుద్ధు డు  ఆశీర్వదించాడు అని భావించి ఆ వస్త్రాన్ని మృతుని పై కప్పాలి .   చైనా బుద్దిస్టులు దీని కోసం తెల్లని బట్టను మాత్రం వాడరు. కారణం ? మృతుని తరుఫు రక్త బంధువులు అందరూ కూడా మృతుని పై

కప్పి నటువంటి రంగు బట్టను ఒక దానిని సమ కూర్చుకొని  దానిని విడవకుండా ఏడూ రోజుల పాటు ధరించి  -  సంతాపము తెలపాలి  .  తెల్ల రంగు వస్త్రాలు- అవి కూడా మొదటిరోజున ధరించినవే  మరలా మరలా తిరిగి ధరిస్తూ  -  ఏడు  రోజుల పాటు  తిరగటం ఎవరికీ సాధ్యం కాని పని  భావించిన చైనీయులు ఈ నియమము పెట్టుకున్నారు .( నా వివరణ -  బౌద్ధ మత నియమాలు- తెల్ల బట్టని వాడాలి అని చెపుతూ వున్నా . అవి ఆచరించే వారు తమ  సౌకర్యాన్ని దృష్టిలో పెట్టుకొని - నియమాలకు కొన్ని మినహాయింపులు చేసి. అమలు పరుచుకున్నారు  - దీనిని తరువాత తరము వారు  " అది మా ఇంటి పెద్దల  ఆచారం కాదండీ" అని చెపుతారు . మత నియమాలలో అనేక తేడాలు ఉండటం- అవి ఆచరించే వారి సౌకర్యము ను పట్టి రూపొందినవే  } హిందువులలో మృతుని కుమారులు ధీక్షా వస్త్రాల పేరున రొండు జతలు సమకూర్చుకుంటారు .

**<>మృతుడి  తదనంతరం ఇంకా ఎప్పుడో చేయవలసినవి ?<>**

బుద్ధుడు చెప్పిన ఐదు నీతులను{ పంచ శీల వాక్యాలు } - రచించిన వస్త్రాలను {ఒక  బ్యానర్ లాగ } ప్రదర్శించమని

బౌద్ధ సన్యాసులను వేడుకోవాలి . వీటిని పాళీ భాష టిబెటియన్ భాష, చైనా భాష , జపాన్ భాష - లేదా మృతునికి ఏ భాష తెలిసి ఉంటే ఆ భాషలో వీటిని రాయించాలి .. { నేటి రోజుల్లో మృతునికి ఇంగిలీషు భాష తెలిసి ఉంటే - వీటిని ఇంగిలీషు లో కూడా రాయిస్తారు - కారణం - చైనా లేదా జపాను భాష కన్నా ఇంగిలీషు రాయటం / చెక్కించటం సులభము కాబట్టి . ఇప్పటి రోజుల్లో పంచ శీల వాక్యాలను రాతిపై ఇంగిలీషులో చెక్కించి మృతుని సమాధి వద్ద ఉంచుతున్నారు . మృతుడు ఏ భాష వాడైనా సరే - బౌధము వారిని ఆహ్వానించింది అని దీని ద్వారా మనము తెలుసుకో వచ్చును .}
ఈ సందర్భముగా మూడు పర్యాయాలు బుద్ధునికి కృతజ్ఞతా పూర్వక గౌరవ వందనము సమర్పించి . వజ్రయానము . థెరవాదము లేదా మహాయనములోని ప్రార్థనలు ఏవైనా చదవవవచ్చు

రచన సేకరణ వివరణ వారణాసి శ్రీ రామ కృష్ణ అఫ్ అమరావతి

**Part- 4-05-24**

టిబెటియన్ బౌద్ధము ఒక వ్యక్తి - తన , మృతి అనంతరము తనను  పాతి పెట్టాలా? , లేక దహనం చేయాలా అనే విషయాన్ని  తన  బంధు మిత్రులతో ముందే చెర్చించి  నిర్ణయించుకోవచ్చు .{ మీ శరీరము మీద పూర్తి అధికారము మీదే అన్న దృష్టితో } అలాంటిది ఏమీ లేనపుడు అతని కుటుంబీకుల ఇష్టము  కలిగిన లేదా సౌకర్యంగా కనిపించిన పద్ధతి ప్రకారము చేయాలి. { కుటింబీకులు తమకు ఇష్టము లేని పని చేయవలసి వస్తే మృతుని పట్ల గౌరవము ప్రదర్శించరెమో ? అని

మృతుడి  తదనంతరం ఇంకా  చేయవలసినవి ?

ఒక వ్యక్తి మృతి చెందిన తదుపరి  అనగా సమాధి వద్ద -- { పంచ శీల ను =  . {1}జీవ హింస చేయక పోవటం {2} దొంగ తనము చేయక పోవటము {3} అక్రమ సంభందాలు నిషేధించుకోవటం {4} సత్యము లేదా నిజము ని మాత్రమే పలకటం (5)  మత్తు పదార్ధలకు దూరం గా ఉండటం -- } బుద్ధుడు చెప్పిన వి  -మరియూ  బుద్దిస్టులు అందరూ అనుసరించవలిసిన వి ఐన  ఐదు నియమాలను - రాసి ప్రదర్శించమని బౌద్ధ సన్యాసులను వేడుకోవాలి.   వీటిని పాళీ భాష టిబెటియన్ భాష,  చైనా భాష , జపాన్ భాష - లేదా  మృతునికి ఏ భాష  తెలిసి ఉంటే ఆ భాషలో రాయించాలి . నేటి రోజుల్లో వీటిని ఇంగ్లీష్ లో రాయిస్తూ

వున్నారు . జీవి అస్తమించిన దానికి సూచనగా మృతుని తల పశ్చిమపు దిక్కుగా  పెట్టి  ఈ పంచ శీల రాయబడిన రాతి ఫలకాన్ని మృతుని తల దిక్కున సమాధులపై ఉంచుతున్నారు .

ఈ సందర్భముగా మూడు పర్యాయాలు బుద్ధునికి కృతజ్ఞతా పూర్వక గౌరవ వందనము సమర్పించాలి .  ఈ కృతజ్ఞతల కోసం వజ్రయానము . థెరవాదము లేదా మహాయనములోని ప్రార్ధనలు ఏవైనా చదవవచ్చు .

మృతుని నితరఫున ప్రార్ధించుట  కొరకు బౌద్ధ సన్యాసి దొరకనప్పుడు - మృతుని యొక్క గుణ గణాలను బహిరంగంగా పొగుడుతూ , అతను చూపిన తెలివిని మెచ్చుకుంటూ ,  ఆ క్రతువుని ముగించాలి.

మృతుని పేరు మీద వస్త్ర దానము చేయవచ్చును .  {దీనిని mataka-vastra-పూజ  అంటారు ) ఇది బౌద్ధ సన్యాసులు ధరించుటకు ఇచ్చే వస్త్రములు కావు . బౌద్ధ మఠానికి పనికి వచ్చు వస్త్రములు అనగా దుప్పట్లు - టవల్స్ వంటివి .  ఈ సందర్భముగా Mahaparinibbana   Sutta  అనే దానిని వల్లె వేయాలి .(Mahaparinibbana Sutta) అనునది - బుద్ధుడు 483 బీసీ లో మరణించి న   పిదప వివిధ భారతీయ రాజులు అయన అస్థికలను తమకు సమంగా  పంచమని అడిగిన తీరును - రాజులు ఆ ఎముకలను విలువైన రత్నాలతో కలిపి పాత్రలలో ఉంచి వాటి పై స్తూపాలను

నిర్మించిన తీరును తెలియ పరుస్తుంది .{**Mahaparinibbana** సుత్త యొక్క సారంశాము ను కూడా తెలుగులో రాస్తాను **}.**

ఏర్పడినవి ఏవీ కూడా సదా కాలము మనుగడలో వుండవు , అలలా పైకి లేవటం ముగిసి పోవటం అనేది సర్వ సాధారణ లక్షణము , ఉదయించిన సూర్యుడు అస్తమించుతాడు --జీవితం నుండి విరమించిన వారు విశ్రాంతిని సంతోషాన్ని పొందుతాఋ - అని ఈ సందర్భంగా పలుకుతారు .

ఇలా పలికిన పిదప , ఒక కప్పునిండా నీరు తీసుకొని దానిలోకి మరింత నీరు పోసి - మృతుని యొక్క గుణగణములు - ఎల్లలు దాటి ప్రవహిస్తున్నవి అని నిరూపణ చేస్తారు . ఈ నీరు పోసే టపుడు "కొండల మీద పడిన వర్షపు నీరు పల్లములోకి చేరి నట్లుగా-- మేము ఇతనికి ఇస్తున్నదంతా అతని వద్దకే చేరాలి --

నీరు నదులను - ఆ నదులు సముద్రము నకు చేరి మానవులకు మేలు చేసినట్లు - మా అర్పణలు అన్నీ మృతులకు మేలు కలుగ చేయాలి - అన్నవాక్యాలు పఠించాలి .

{ నా వివరణ - హిందువులు సూర్యునికి అర్ఘ్యము విడుస్తారు - నది లేదా చెరువు లోనుండి నీరు దోసిలితో తీసుకొని - ఆ దోసిలి లోని నీటిని అదే నది లేదా చెరువులోకి వదులుతారు . నీటిని తీసి తిరిగి అదే నీటిలో పోయుట వెనుక లాజికల్

భావన ఏమిటి ?  దోసిలి లోని నీరు తిరిగి నీటిలోకి జారినపుడు కొన్ని  జల తరంగాలను కలుగ చేస్తుంది .అవి వ్యాప్తి చెందుతూ  ముందుకు పెడతాయి .

" ఓ సూర్య భగవానుడా నీ కీర్తిని/నీవు చేస్తున్న మేలును నేను అన్ని దిక్కులకూ - ఈ జలతరంగాల మాదిరి ఆ వ్యాప్తి చేస్తాను - అని ప్రతిజ్ఞ చేస్తున్నాను " అని అర్ఘ్యం విడుస్తున్న వారు సూర్యుని కి  చెపుతున్నట్లు . }  {అలాగే హిందువులు మృతుని కి ధర్మోదకాలు . తిలోదకాలు -ఇస్తారు . దీని అర్ధము కూడా " " ఓ మృతుడా నీ కీర్తిని/నీవు మాకు చేసిన మేలును గురించి  నేను అన్ని దిక్కులకూ - ఈ జలతరంగాల మాదిరి ఆ వ్యాప్తి చేస్తాను - అని ప్రతిజ్ఞ చేస్తున్నాను " అని భావించ వచ్చు . }

అదనపు సమాచారం ఏమిటంటే ?నెహ్రు    గారు కూడా - చైనా కు  పంచ శీల సిద్ధాంతాలు ప్రతిపాదించారు . చైనా  వీటిని బేఖాతరు చేసి చైనా భారత్ పై దాడి  చేసింది .ఇప్పటికీ చైనా భారత్ పై కాలు దువ్వుతూ ఉంటుంది . కాలు దువ్వటం చైనా వారి పాలసీ .నెహ్రూఊగారు ప్రతి పాదించిన పంచ శీల సిద్ధాంతాలు--   01 :- మనకిరువురికి  కూడా సార్వభౌమత్వ అధికారాలు -సరిహద్దులు వున్నవి అని గుర్తించుదాము 02 . మనము దుందుడుకు నిర్ణయాలకు పోరాదు .o3. ఒకరి అంతర్గత విషయాలలో ఇంకొకరం జోక్యం  కలుగ చేసుకోవద్దు , 04. ఇరువురమూ  సమానముగా ఉండి

సమాన ప్రయోజనాలు పొందుదాము -05 . శాంతి తో గడుపుదాము , ఇది 1957 లో .

సేకరణ సమర్పణ వారణాసి శ్రీ రామ కృష్ణ అఫ్ అమరావతి

**Part- 5** 5-5-24

అమితాభుడు అనగా స్వర్గమును సృష్టించిన బుద్ధుడు టిబెటియన్లు మృతి చెందిన వారి ముందు "అమితాభ" అన్న నామాన్ని స్మరిస్తారు .బుద్ధుడిని క్షితి గర్భ బోధి స్టసత్వుడు గా పేర్కొని కీర్తిస్తారు .బుద్ధుడు అమితాభుడు అనే పేరుకల సన్యాసి వేషములో భూలోకానికి వచ్చి , భూలోక వాసులకు 18 వరాలు ఇస్తాడు . తనను నమ్మిన వారిని, తన పేరును ఫది సార్లు స్మరించిన వారికి స్వర్గము ఇస్తాను అన్నది ఆ వరాలలో ఒకటి . స్వర్గము ఇవ్వటమే కాక అక్కడవుంటూనే మోక్ష సాధన చేసే వరము కూడా ఇస్తాడు . అందువల్ల మృతుని దేహము ముందు అమితాభుడి నామము తలుస్తారు . అమితాభుని పేరు క్రీస్తు శక్యము 650 లో ప్రాచుర్యం లోకి వచ్చింది . అమితాభుడు , ఒక కేంద్రంగా ప్యూర్ ల్యాండ్ బుద్ధిజం {అనగా నేరుగా బుద్ధుడు సృష్టించిన స్వర్గపు నేల పైనే తిరిగి పుట్టటం అనే భావన ఏర్పడింది .

అమితాభుడు వాత్సల్యముతో మృతులకు ఎదురు వచ్చి వారిని స్వర్గము అనే తన ప్యూర్ ల్యాండ్ లోకి తీసుకు వెడతాడు . }{ జపాను వారు తమ భూమిని  ప్యూర్ ల్యాండ్ అని చెప్పుకుంటారు }

మృతుల సంస్మరణార్ధం  జరిపే పండుగలో చైనావారు బుద్ధుని అమితాభుడు అన్న పేరున ఆహ్వానము చేయటము లోను , .బుద్ధుని క్షితి గర్భ భోదిసత్వునిగా  కీర్తించటము లోనూ ఉన్న విషయము ఇదే . ఇహ "లా ఓ సు"  , అనేదేశం వున్నది . దానికి ఒక దిక్కున మయన్మార్ ,చైనా , వియత్నాం కంబోడియా థాయ్ ల్యాండ్ వున్నవి .ఇవన్నీ కూడా బుద్దిస్ట్ ప్రభావము కలిగివున్న దేశాలే . లాఓస్ లో మృతుని పట్ల జరిపే  ఆచారాలు వేరుగా ఉంటాయి .లాఓస్ వారు మృతులకోసము ఏడాదికి రెండు పండగలు జరుపుతారు . చాంద్రమానం ప్రకారము వచ్చే తొమ్మిదో నేలలో - చంద్ర  దర్శనం అయినా మరునాడు మొదటి పండుగ  - నిండు పౌర్ణమి నాడు రెండో పండగా జరుపుతారు .

మొదటి పండుగ నాడు అరిటి ఆకుల్లో అన్నము వడ్డించి మృతులకు నైవేద్యం చేస్తారు . రెండో పండగరోజున ఒక వెదురు బుట్టలో అన్నము పానీయము, పూలు కానుకలు వంటివి పెట్టి - అది మృతులలో ఏవరికి అందచేయబడాలో అనేది ఒక చీటీ పై రాసి ఆ బుట్టలో ఉంచుతారు . వాటిని బౌద్ధ

సన్యాసులకు అందచేసి మృతులకు అందచేయమని కోరుతారు .

ఇక్కడికి **bardo thodal** అన్న గ్రంధము గురించి సమాప్తము అయ్యింది .

F
A

**Bordo Thodal ends here**

**—-----------------------------------------------------**




పైన వున్నది  పంచ శీల




## పైన వున్నది అష్టాంగ మార్గము - పంచ శీల దీనిలోని ఒక భాగము



**Above is ksshiti garbha bhudda image**

**క్షితిగర్భ బోధిసత్వ 30-4-24**

చైనా బుద్ధిజం పేరు . టిబెటియన్ బుద్ధిజం పేరు .
చైనా బుద్ధిజం ప్రకారం - చని పోయినవారి సంస్మరణనను వారి చనిపోయిన తేదీని పట్టి కాక - చనిపోయిన వారందరి కోసము అని కేటాయింప బడిన ఒక నెలలో జరుపుతారు . ఆనేలలో బుద్ధిజం పద్ధతుల ప్రకారము

మృతులు భూలోకానికి ఆహ్వాన్నింపబడి- తమతో పాటుగా ఒక పండుగలో పాల్గొనవలసిందిగా కోరబడతారు . అప్పుడు బుద్ధుని క్షితి గర్భ భోదిసత్వునిగా కీర్తిస్తారు {. Ksitigarbha Bodhisattva } క్షితి గర్భ బోధిసత్వుడు, మృతులు నరక ద్వారాలవేపు కాకుండా- స్వర్గ ద్వారాల పైపుకు పోయే దారి చూపుతాడు . క్షితి అనగా భూమి ఆకాశములు కలుస్తూ ఉన్నట్లు వుండే చోటు . భూమిగుండ్రముగా ఉన్నందువల్ల , భూమి- ఆకాశము రెండు అంచుల వద్ద కలుసుకున్నట్లు అగుపిస్తాయి . అందులో ఒకటి నరక ద్వారము మరొకటి స్వర్గద్వారము అని వూహ . క్షితి గర్భుడు స్వర్గం వేపు దారి చూపుతాడని భావము . ఈయనను "ప్రతిన తీసుకునే బుద్ధు డు"లేదా " బాకీ పడే బుద్ధుడు " అని కూడా అంటారు . అనగా ఈయన అందరినీ స్వర్గము పైపు నడిపిస్తాను అని ప్రతిన తీసుకున్నాడు అని అర్ధము . ఈ రకము గా అయన నరకము అనేది లేకుండా నే చేసాడు . నరకము ను పాలించే వారిని . పాపుల మీద తీర్పు చెప్పే దేవతలను నామ మాత్రులను చేసి ఉంచాడు .

బుద్ధుడు, అవలోకితేశ్వర, బోధిసత్వ , మంజుశ్రీ మరియూ సమంతభద్ర అనే నాలుగు అవతార రూపాలలో ఎంత గొప్పవాడో- క్షితి గర్భుని అవతార రూపములో కూడా అంతే గొప్ప వాడు . ఈ రూపములో అయన యమునికి ప్రభువు . ఈయన జనులు కోరిన చోటుకు రాగల స్వభావి. ఈయన తన సభలో Garbhadhatu మండల అనే దానిని నిర్వహించి ఒకమనిషికి పై స్థాయి మనిషి ఎవరూ? అన్నది నిర్ణయం చేస్తూ ఉంటాడు . ఈయన , ఐదుమొనలు కల కిరీటం ధరించి ,ఒక దండము, మంచిముత్యము { మంచి గర్భమునకు సూచిక } చేతులలో పట్టుకుని , పద్మము మీద ఆసీనుడై దర్శనం ఇస్తూ ఉంటాడు .

జపాన్ దేశములో రోడ్డు పక్కాగా - కర్ర పట్టుకొని నుంచున్న సన్యాసి ఆకారములో అనేక బొమ్మలు ఉంటవి. ఆ ముఖములు వేరుగా వున్నా కూడా అవి అన్నీను క్షితి గర్భుని రూపాలుగా గా గుర్తించాలి . రోడ్డు మీద ఏదన్నా యాక్సిడెంట్ జరిగినపుడు క్షితి గర్భుడు కనుక రోడ్డు పక్కనే ఉండి చూస్తే మరణించిన వారు నేరుగా స్వర్గము పైపుకే దారి పడతారు అని

జపనీయులకు ఓ  నమ్మకం వుంది . అందుకని వారు అలాంటి బొమ్మలు రోడ్డు వారగా నిలుపుతారు .

**A ORIGINAL BY** వారణాసి శ్రీ రామ కృష్ణ  అఫ్ అమరావతి





**Above 2 are s ksshiti garbha bhudda on road sides of japan**



VARANASI SREE RAMA KRISHNA ON 28-4-24

నేను అమరావతి వాడిని . బుద్ధుడు మావూరిలో నడయాడాడని దలై లామా గారు అభి ప్రాయ పది అక్కడ కల చెక్రను నిర్వహించారు . నేను బుద్ధిజం ని అవగాహన చేసుకోవటానికి - దానిని ఇతరులకు తెలపటానికి ఒక ప్రాజెక్ట్ స్టార్ట్ చేసాను .మీవంతు ప్రోత్సాహంగా ఏదన్న ఆర్థిక సాయము నా ప్రాజెక్ట్ కి అందించ తలిచితే నా ఫోన్ నెంబర్ **9908482191** కి పంప గలరు. మీపేరును నేను రాసిన బుక్స్ లో ప్రచురించి మీకు కూడా కీర్తి కల్పించు తాను